మగళ్ళ మనస్తత్వమును కొంతకుకొంత ప్రదర్శించుచున్నది. మచ్చుకొఱకు ఇందలి కొన్నిఘట్టములను స్థలాంతరమున ముద్రించియున్నాము. మనసంఘవ్యవస్థను పచ్చను పాడొనర్చుచున్న అనేక దోషము లీగ్రంథమున ప్రసక్తానుప్రసక్తిగ వివరింపబడినవి. తెనుగువారు కాలక్షేపార్థము చదువుకొనదగు గ్రంథములలో నిదియొకటియగుట నిశ్చయము. క్రౌను సైజున నూటముప్పది పుటలుగల ఈ పుస్తకము యొక్క మూల్యము నాలుగు అణాలుమాత్రమే యుంచుట ఎంతయు మెచ్చదగినది. సంఘసంస్కారమే ప్రధానోద్దేశముగ నీనాటకమును రచియించిన శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావుగారు దీనిని అద్వితీయ సంఘసంస్కర్తయైన శ్రీకందుకూరి వీరేశలింగకవికి అంకితమిచ్చుట ఎంతయు సముచితముగ నున్నది. ప్రతులకు చేకుమళ్ళ విశ్వనాథముగారు, రాజమండ్రి అని వ్రాయునది.

## ౧౫౮. రాధామాధవము

ఆంధ్రవాఙ్మయపు అగస్టన్ ఏజ్ అనదగిన రాయలకాలమునకు చెందియు ఇంతవఱకు విస్మృతిగహనము పాలై యున్న చింతలపూడి ఎల్లనకవికృతములగు రాధామాధవము, తారకబ్రహ్మరాజము, విష్ణుమాయానాటకము అను మూడుప్రబంధములలో మూడవదానిని ఇటీవల చెన్నపురి విశ్వకళాపరిషత్తువారు ప్రచురించిరి; మొదటిదానిని ఇపుడు తూర్పుగోదావరి మండలమునకు చెందిన కపిలేశ్వరపురము జమీందారువారు శ్రీబలుసు బుచ్చి సర్వారాయుడుగారు ప్రకటించిరి. ప్రాచీనాంధ్రప్రబంధములను ఎన్నిటినో విస్మృతికూపమున బడిపోకుండ తూర్పుగోదావరి మండలమునకు చెందిన శ్రీకందుకూరి వీరేశలింగము పంతులుగారు, పోలవరము జమీందారువారు, శ్రీ చెలికాని లచ్చారావుగారు, పిఠాపురము మహారాజావారు కాపాడి ఆమండలమునకు వాసిగూర్చిరి. ఈరాధామాధవకావ్యప్రచురణములో శ్రీకపిలేశ్వరపురాధినాయకులు ఆవాసికి వన్నెకూర్చుచున్నారు. ఇందుకు వారినెంతయు అభినందించుచున్నాము. రాధామాధవము ఐదాశ్వాసముల ప్రబంధము. రాధామాధవుల స్వయంవర వివాహమహోత్సవము ఈప్రబంధమున ప్రస్తరింపబడినది. రాధ శ్రీకృష్ణుని మేనత్తగాక అతనికులపాలికయైయున్నది. కవితాప్రావీణ్యఫణీశుడగు కృష్ణదేవరాయ లీకావ్యము నాలించి అందలి మేలెంచి ఈకావ్యనామమగు 'రాధామాధవము'ను ఈకవికి బిరుదముగా నిచ్చినాడు. అగుటనే ఈకవికి రాధామాధవ బిరుదము ప్రఖ్యాతిమైయున్నది. ఈకవి పూర్వకవిస్తుతిలో 'కర్ణాటకక్ష్మానాథేంద్రుసభన్ కవిత్వవిజయోత్సాహంబుఁ గైకొన్న మా శ్రీనాథున్' అని శ్రీనాథుని పొగడియున్నాడు. ఇతడు శ్రీనాథునివలె కర్ణాటకక్ష్మానాథేంద్రుసభలో కవిత్వవిజయోత్సాహము గైకొన్నవాడగుటయేగాక ఈకావ్యరచనమున అతని శృంగారనైషధమును కొంతవఱకు మేలుబంతిగ చేకొనినాడు. రాధామాధవములోని మధురవాణీ దూత్యము నైషధములోని హంసదూత్యమునకు జతపడుటయేగాక కొన్నిపద్యములు, కొన్నివాక్యములు, కొన్నిపలుకుబళ్లు సాదృశ్యనిబంధనములై యున్నవి. వర్ణనాసందర్భమున ప్రౌఢశైలియు, సంభాషణావసరమున సులభసుందరశైలియు నవలంబించి ఈకవి శైలిలో శిల్పమును పాటించినాడు. అందనిమ్రానిపండులకు అఱ్ఱులుచాచుట, ఒక్కకొడుకును కొడుకుగాడు ఒక్కకన్ను కన్నుగాదు, చెంద్రుకవట్టియుఁ గొండఁ బ్రాకె, తీగకు కాయలు బ్రేఁగా మున్నగు సామెతలను పొందికగా వాడియున్నాడు. స్థలసంకోచమున ఈప్రబంధపరామర్శ ఇంతతో ముగింపవలసినవారమగుచున్నాము. గ్లేజుకాగితములమీద ముద్రితమై మూడువందల ఏబదిపుటలతో కాలికోబైండులో నొప్పు దీనివెలరు.1-8-0 మాత్రమే యుంచుటజమీందారువారి ప్రజాహితాభిలాషను వెల్లడించుచున్నది.

Printed at The Andhrabhumi Printing Works, Vepery, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.

